# చిత్రకథలు

3 వ భాగము.




కర్త:

నిడమర్తి సత్యనారాయణమూర్తి

బి. ఏ., బి. యిడి.





ప్రకాశకులు:

వి. వెంకటేశ్వరరావు అండు కో

కైకలూరు. (కృష్ణాజిల్లా)

# చిత్రకథలు

3 వ భాగము.

---

గ్రంథకర్త:

పెదమర్తి సత్యనారాయణమూర్తి. బి. ఏ., ఎల్. టి.

---

ప్రకాశకులు:

హంపాటి వెంకటేశ్వరరావు అండు కో.,

కైకలూరు,
కృష్ణా జిల్లా.



వెల 0—4—0.

# విజ్ఞప్తి



మూడవ తరగతి విద్యార్థులు దీనిని చదివి స్వయముగ అర్థముచేసికొనవలెనని మా తలంపు. అందుచేతనే సంధికలుగకుండ పదములను విడదీసి వ్రాసినాము. ఇందలికథలు పసివారి మనస్సులను సులభముగ ఆకర్షించి ఉన్నతభావములను పుట్టించునట్టివి. దీనిమూలమున బాల బాలికలకు పఠనాభిలాష కలిగినచో మా ఉద్దేశము నెరవేరినదగును.

# విషయసూచిక.

## 3 వ భాగము.


| | | పుట. |
|---|---|---|
| 1. | తెలివిగల గొఱ్ఱెలు | 1 |
| 2. | సింహము—బాలిస | 2 |
| 3. | నక్క—కాకి | 3 |
| 4. | సింహము—చిట్టెలుక | 5 |
| 5. | పేరాసగల నక్క | 6 |
| 6. | అప్పాజీ—ఏనుగులు | 7 |
| 7. | పోరాడిన పిల్లులు | 8 |
| 8. | ఐకమత్యము బలము | 10 |
| 9. | తెలివిగల కాకి | 11 |
| 10. | ఆల్ఫ్రెడు | 12 |
| 11. | ముసలివాడు—గాడిద | 14 |
| 12. | పెంకెగాడిద | 15 |
| 13. | నిమ్మకాయ యంతే మోసము | 16 |
| 14. | బాతు—బంగారుగుడ్లు | 18 |
| 15. | కొంగ—నక్క | 19 |
| 16. | సగములాభము | [illegible] |
| 17. | పిల్లి—గరుడుడు | 22 |
| 18. | అంతులేనికథ | 23 |

# 1. తెలివిగల గొఱ్ఱెలు.

ఒక్క కాలువమీద వంతెనకలదు. అది ఒకేమారు ఒకరుమాత్రమే దాటగలిగినంత సన్నముగ ఉండెను. ఒక దినమున రెండు మేకపోతులు చెరొకవైపునుండియు దానిని దాటవలెసివచ్చెను. వంతెన సన్నముగ ఉండుటచే రెండును ఒకమారుగ దాటవీలులేదు అని అవి ఎఱిగి ఉండెను. కాని దేనికి అది ముందుగ దాటవలెను అని పంతగించెను. కనుక రెండును వంతెనమీదకువచ్చి మధ్యలో కలసికొనెను. అక్కడ ఆరెండును పోరాడ తొడగెను. ఒకదానిని ఒకటి త్రోసికొనుటలో రెండును కాలువలోపడి లోతునీటమునిగిచచ్చిపోయెను.

మఱిఒకదినమున ఆవంతెన మధ్యనే మఱిరెండుమేకలు కలసికొనెను. రెండును ఒకేసారి దాటుటకు వీలులేదు అని అవి తెలిసికొనెను. వెనుతిరిగి పోవలెను అని అవిచూచినవి. కాని అందుకుకూడ అవకాశములేకపోయెను. తోడనే అందు ఒకటి రెండవదానికిఇటులు అనెను. "మిత్రుడ! మనము ఇపుడు అపాయకరమగు స్థితిలో ఉన్నాము. కనుక నేను ఒకటిచెప్పెదను వినుము. నేను క్రింద పరుండుదును. నీవు నాపైనుండి నెమ్మదిగ నడచిపొమ్ము, తరువాత నేను లేచిపోదును." అనెను. ఆమాటలకు రెండవ మేకపోతు ఒప్పుకొనెను. వెంటనే అవి ఆవిధమున ఆచరించి అపాయమునుండి తప్పించుకొని క్షేమముగ ఇండ్లకుపోయినవి.

**పోరు నష్టము, పొందు లాభము.**



# 2. సింహము - బానిస

మనము ఎడ్లను ఆవులను అమ్మినట్లే పూర్వము కొందఱుమనుష్యులనే అమ్మెడివారు. ఆవిధముగ అమ్మబడినవారిని బానిసలు అని పిలుతురు. వారు పశువులుచేసినట్లే అన్నిపనులును యజమానికి చేయవలసి ఉండిరి. అట్లు చేయని-చో వారిని గొడ్డను బాదినటు బాదెడివారు.

అండ్రోకలీసు అట్టి బానిసలలో ఒకడు. అతని యజమాని బహుక్రూరుడు. అండ్రో కలీసును మిక్కిలి బాధించెడివాడు. ఆబాధపడలేక అతడు ఒకనాడు ఎవరికని తెలియకుండ అడవిలోనికి పారిపోయెను. పారిపోయిన బానిసకు శిక్ష మరణమే. అందుచే అతడు అడవిమధ్యకు పోయెను.

ఆ అడవిమధ్య అతనికి ఒక మూలుగు వినిపించెను. ఎవరో బాధపడుచున్నారు అని ఎంచి అతడు నలుదిక్కులు చూచెను. అపుడు అతనికి ఒకసింహము కన్పించెను. ఆ సింహమునకు పంజా వాచెను. ఆమృగము తనపాదమును అతనికి చూపెను. దానిలో ముల్లు విరిగి ఉండెను. అండ్రోకలీసు దానిని పట్టుకొని ముల్లుతీసి, చీముపిండి, ఆకులతో కట్టుకట్టెను. సింహమునకు బాధతగ్గెను. వారు ఇరువురును స్నేహితులైరి. సింహము ప్రతిదినము కొంతమాంసముతెచ్చి అతనికి ఇచ్చుచు ఉండెను.

M

ఒకనాడు కొందఱువేటకాండ్రు, సింహమును పట్టుకొనిరి. వారే ఆండ్రోకలీసునుకూడ పట్టుకొని రాజువద్దకు తీసికొనిపోయిరి. రాజు అతడు పారిపోయిన బానిస అని తెలిసికొని మరణశిక్ష విధించెను. అతనిని ఆకలితోఉన్న సింహముచే చంపింపవలెను అని రాజు ఆజ్ఞ.

మఱునాడు ఆండ్రోకలీసును సింహముబోనువద్ద నిలిపి తలుపు తెరచిరి. దానికి మూడుదినములనుండి ఆహారము లేదు. కాని అది అతనిస్నేహితుడే అందుచే అతనివద్దచేరి సంతోషమును చూప మొదలుపెట్టెను. రాజు ఆశ్చర్యపడి దానికి కారణమును తెలిసికొని ఆండ్రోకలీసును, సింహమును కూడ విడిచిపుచ్చెను.

క్రూరమృగములుకూడ విశ్వాసమును చూపును.

---

## 3 నక్క — కాకి

ఒకనక్క ఆకలిగొని ఉండెను. చాలచోటుల తిరిగెను. కాని ఆహారమును సంపాదింప లేకపోయెను. అది తిరిగి తిరిగి ఒక చెట్టునీడను చేరగా ఆచెట్టుపై ఒకకాకి కూర్చుండెను. ఆకాకినోట ఒకమాంసపుముక్క ఉండెను. దానిని ఎట్లైనను హరింపవలెను, అని జిత్తులమారినక్క తలచెను. కనుక కాకివంకచూచి ఆనక్క సలాముచేసి ఇట్లు అనెను. "కాకమ్మ! ఏమి నీఅందము! నీవంటి అందకత్తెను నేను ఎచటను చూడ



లేదు. నీకంఠముకూడ హాయిగ ఉండును అని చెప్పుకొనగా వింటిని. స్వయముగ వినలేదు. ఇపుడు ఒకసారి నీగానముచే నాకు ఆనందమును కూర్పవా?"

ఈస్తుతి నిజమే అనితలచి ఆవెఱ్ఱికాకిపిల్ల "కావు, కావు" అని అరవసాగెను. నోరు తెఱవగానే మాంసపుముక్క నేల మీదపడెను. నక్క వెంటనే దానిని నోటకఱచుకొని కాకి వంక చూడనైన చూడకుండగనే తనదారిని పోయెను.

ముఖస్తుతికి ఉబ్బరాదు.

# 4. సింహము - చిట్టెలుక.

ఒకనాడు ఒకవనములో ఒకసింహము వేటాడి అలసి వచ్చి పరుండెను. తోడనే దానికి నిద్రపట్టెను. ఆసమీపమున కన్నములోఉన్న ఒకచిట్టెలుక సింహముపై ఇటుఅటు పరుగె త్తుచు ఆడుకొనసాగెను.

అందువలనఆమృగరాజునకునిద్రచెడెను. సింహముకోపము తో మేల్కాని కళ్ళుతెఱచి చిట్టెలుకను చూచి పట్టుకొని చంపబోయెను. చిట్టెలుక భయముతో ఇట్లుఅనెను. "అయ్యా! నేను తెలియక నేరముచేసితిని. నన్ను చంపకుము. ముందుఎప్పు డైన నీకు సాయముచేతును." సింహము ఎక్కడ, చిట్టెలుక ఎక్కడ; సింహమునకు చిట్టెలుక సాయముచేయుటా? అని సింహము తలచెను. కాని దానిమాటలకు అలరి సింహము దానిని విడచెను.

తరువాత కొన్నిదినములకు కొందరువేటకాండ్రు సింహమును పట్టుకొనుటకు వలలను ఒగ్గిరి. సింహము వానిలో తగులుకొని పారిపోవజాలక ఉండెను. చిట్టెలుక అదిచూచి, చురచురవచ్చి, వలత్రాళ్ళను కొఱికి, సింహమును విడిపించెను. అపుడు సింహము దానికృతజ్ఞతకు సంతసించి వెడలిపోయెను.

చిన్నవారుకూడ పెద్దవారికి సాయముచేయగలరు.



# 5. పేరాసగల కుక్క



ఒకనాడు ఒకకుక్క చాలఆకలితో ఊరంతయు తిరిగెను. తిరుగగా తిరుగగా దానికి ఒకమాంసపుముక్క దొరకెను. దానిని నోటకఱచుకొని అది ఊరిలోనికిరాసాగెను మార్గమధ్యమున అది ఒక కాలువ దాటవలసిఉండెను. ఆకాలువకు అడ్డముగ ఒకవంతెనకలదు. అదిఆవంతెనపై పోవుచు క్రిందనున్న నీటిలోనికి తొంగిచూచెను.

ఆనీటియందు దానికి తననీడ కనబడెను. కాని అది తననీడఅని ఆకుక్క గ్రహింపలేక అదిమరిఒకకుక్క అనితలచెను. దానినోటిలోఉన్న మాంసఖండముకూడ తానే తీసి

కొనవలెను అని తలచెను. వెంటనే బొయ్యుమని అది మొఱి గెను. మొఱుగుటకు నోరు తెఱవగనే దానినోటిలోని మాంసము నీటిలోపడెను. లేనిదానికిపోయి ఉన్నది పోగొట్టుకొనిఅనుక్క విచారముతో ఇంటికిపోయెను.

దురాశ దుఃఖమునకు చేటు.



## 6. అప్పాజీ - ఏనుగులు.

అప్పాజీ అని పూర్వము ఒకమంత్రి కలడు. అతడు మంచి తెలివికలవాడు. అతని తెలివితేటలకును, న్యాయమున కును జనులు అందరును మెచ్చుకొనుచు ఉండిరి.

ఒకనాడు అతనివద్దకు ముగ్గురు అన్నదమ్ములు సలహా అడుగుటకు వచ్చిరి. వారితండ్రి ధనవంతుడు. తనకు ఉన్న డబ్బును, భూములను, గుఱ్ఱములను, ఏనుగులను వారు పంచు కొనవలసినది అని అతడు విల్లువ్రాసెను. అతనికి పదునేడు ఏనుగులు కలవు. వానిని వారు అమ్మకుండగనే సగము పెద్ద వాడును, మూడవవంతు రెండవవాడును, తొమ్మిదవవంతు మూడవవాడును తీసికొనవలెను అని అతని ఆజ్ఞ. వానిని ఎట్లు పంచుకొనవలెనో వారికి తెలియలేదు.

అప్పాజీ ఆమాటలువిని మరునాడు తాను వెడలి వానిని పంచిపెట్టుదును అనిచెప్పి వారిని పంపెను. మరునాడు అప్పాజి ఏనుగును ఎక్కి వెళ్లెను. వారి పదునేడు ఏనుగులను తనఏనుగు తోకలిపి వరుసగా నిలపెట్టెను. అపుడు అవి పదునెనిమిది ఉండెను. అందు సగము అనగా తొమ్మిదింటిని పెద్దవానికి ఇచ్చెను. రెండవవానికి మూడవవంతు ఆరింటిని ఇచ్చెను. మూడవవానికి తొమ్మిదవభాగము రెంటిని ఇచ్చెను. చివరకు తనది ఒకటేమిగిలెను. దానిని తానుతీసికొని అప్పాజీ ఇంటికి పోయెను. అప్పాజీతెలివికి అందరును ఆశ్చర్యపడిరి.

తెలివిగలవారిని అందఱును మెచ్చుకొందురు.



# 7. పోరాడిన పిల్లులు

రెండుపిల్లులుకలసి స్నేహముగ తిరుగుచుండెడివి. ఒక నాడు ఆరెండును ఒకఇంట ప్రవేశించి తినుబండారములకొఱకు వెదుకసాగెను. ఆసమయమున, వానికి ఒకజున్నుముక్క గోచరించెను. దానిని ముందుగా పట్టుకొనవలెను అవిరెండును పోట్లాడి చెరి ఒకముక్క తీసికొనెను.

ఆరెండుముక్కలలో ఒకటి పెద్దది, రెండవది చిన్నది. కనుక ఆరెండు పిల్లులును తగవులాడుకొని తీర్పుకొఱకు ఒక కోతివద్దకు పోయెను. ఆకోతి వానితగవు తీర్చెదను అనిచెప్పి

చు త్రాసును ఒకదానిని తెచ్చి ఆరెండుముక్కలను పళ్లెములలో పెట్టి తూచెను. అందు ఒకముక్క బరువుగ ఉండెను. ఆముక్కను పైకితీసి రెండవదానితో సమానముగ చేయుదునుఅనుచు కొంచెము ముక్కను కొఱికి మరలతూచెను.

ఈసారి రెండవముక్క బరువుగ ఉండెను. కనుక మరల దానిని కొఱికి తూచెను. ఈవిధముగ ఒకసారి మొదటి ముక్కను, వేరొకసారి రెండవముక్కను కోతి కొఱికి తినసాగెను. అదిచూచి పిల్లులు చివఱకు తమకు ఏమియు మిగులదు అని గ్రహించి కోతితో ఇట్లు అనెను. "అయ్యా! మర్కటేశ్వర! మీరు ఇక కష్టపడవలదు. ముక్కలు సమముగ ఉన్నను లేకున్నను మేము తీసికొన తలచినాము కావున మా ముక్కలను మాకుఇమ్ము."

ఆమాటలువిని మర్కటము ఇటులుఅనెను. "ఓ వెఱ్ఱి పిల్లులారా! నేను ఇంతవరకును కష్టించి చేసినపనికి ఫలముగా ఈచిన్నముక్కలను తీసికొందును. మీరు ఇక దయచేయుడు" ఆమాటలువిని పిల్లులు తమ తెలివితక్కువకు విచారించుచు ఇండ్లకుపోయెను.

తగవులాట దండుగ ఇచ్చును.

# 8. ఐకమత్యము బలము

పూర్వము ఒక ముసలివానికి, కుమారులు అనేకులు గలరు. వారు ఒకరితో ఒకరు పోరాడుచు ఉండిరి. వారిని మంచి మార్గమునకు త్రిప్పవలెను అని ముసలివాడు అనేక యత్నములుచేసెను. కాని ఉపయోగము లేకపోయెను.

ఒకనాడు అతనికి ఒక ఉపాయముతోచెను. వెంటనే వాడు ఒకకట్టెలమోపును తెప్పించి కుమారులను తనయెదుటికి పిలిపించెను. వారు అందరును వచ్చిరి. వారిని ఆకట్టెల మోపును విఱువవలసినది అని ఆముసలివాడు ఆజ్ఞాపించెను.

వారు అందరును ఒకరివెనుక ఒకరు ఆమోపును విఱువవలెను అని ప్రయత్నించిరి. కాని ఒకరునుకూడ దానిని విఱువలేకపోయిరి. అపుడు ముసలివాడు ఆమోపును విప్పించి ఒక్కొకపుల్లనే వారికి విఱువనిచ్చెను. వారు ఆపుల్లలను సులభముగ విరువకలిగిరి.

ఆ ముసలివాడు వారివంకచూచి ఇటులు అనెను. "కుమారులారా! ఈపుల్లలు అన్నియుకలసి కట్టగా ఉన్నంత సేపును మీరు విరువలేకపోయిరి. అవి విడిగా ఉన్నపుడు విరువకలిగితిరి. అట్టులే మీరు అందరును కలసిఉన్నచో మిమ్ము ఎవ్వరును జయింపజాలరు. మీలో మీరు తగవులాడినచో మిమ్ము అందరును జయింతురు. ఇకనైన తగవులు మానుడు."

ఆమాటలువిని వారు సిగ్గుపడి తమలో తాము పోరాడుట మాని స్నేహాముగ ఉండిరి.

ఐకమత్యమే బలము.

---

# 9. తెలివిగల కాకి



ఒకవేసంగిరోజున ఒకకాకి చాలదాహాముగొని నీటికొఱకు వెదకుచు ఉండెను. ఎక్కడచూచినను దానికి త్రాగుటకు ఒకచుక్కనీరుకూడ దొరకలేదు. తిరుగగా తిరుగగా

ఒక్కకుండ దానికి కనపడెను. అందు అట్టడుగున కొలదిమాత్ర మునీరు కలదు. ఆకుండ లోతుగాఉండుటచే కాకి ఎంతవంగి చూచినను నీరు అందలేదు. కుండను ప్రక్కకు వంపచూచెను. కాని అదియును లాభింపలేదు.

నోరు ఎండిపోవుచున్నను కాకి అధైర్యపడక ప్రయత్న ముచేసి నీరుత్రాగవలెను అని నిశ్చయించెను. ఒక్కనిముసము ఆలోచించి దగ్గరఉన్న చిన్నచిన్నరాలను ఏరుకొని వచ్చి ఒక్కటి ఒక్కటే కుండలో వదలెను. రాలు హెచ్చినకొలదిని నీరు పైకి ఉబుకసాగెను. నీరు అందువరకును రాలనువేసి నీరు త్రాగి కాకి దాహము తీర్చుకొనెను.

కష్టే ఫలీ.



# 10. ఆల్ఫ్రెడు

ఇంగ్లాండును పాలించినరాజులలో ఆల్ఫ్రెడు ఒకడు. ఇత డు బాల్యముననే రాజ్యమునకువచ్చి తెలివితేటలకును, సాహ సమునకును పేరుకాంచెను.

ఆకాలమున డేనులు అనువారు ఇంగ్లాండుతో పోరాడుచు ఉండిరి. ఆల్ఫ్రెడు వారితో అనేకయుద్ధములుచేసి చివరకు ఓడి

పోయెను. అపుడు వారు అతనిని పట్టుకొని చంపవలెను అని అన్నిమూలలను వెదుకసాగిరి.

ఆల్ఫ్రెడు డేనులనుండి తప్పించుకొనుటకు గొల్లవానివేషముతో తిరుగుచు ఒకకాపువానియొద్ద పశులకాపరిగా కుదిరెను. ఆకాపువానిభార్య గయ్యాళి. ఆ ఆల్ఫ్రెడును అనేకరీతుల బాధించెను. కాని అతడు వానిని ఓర్చుకొనెను.

ఒకనాడు ఆమె పొయ్యిపై రొట్టెను కాల్చుచు ఎచటికో పోవలసివచ్చి అతనిని చూడవలసినది అని చెప్పెను. అతడు అట్లే అని ప్రొయ్యిప్రక్క కూర్చుండెను. అట్లు కూర్చుండి అతడు డేనులనుగూర్చియు వారిని ఎట్లుఓడించవలెను అను విషయమునుగూర్చియు ఆలోచించుచుండెను. అందుచేరొట్టెల మాటను అతడు పూర్తిగ మఱచెను.

కాపువానిభార్య వచ్చుసరికి రొట్టెపూర్తిగమాడి వాసనకొట్టుచుండెను. అతడు ఆలోచించుచు కూర్చుండెను. ఆమెకు అదిచూడగనే పట్టరానికోపము వచ్చెను. నోటికివచ్చినట్లెల్లఆమె అతనిని తిట్టెను. కాని ఆల్ఫ్రెడు చిఱునవ్వుతో ఉండెను. తరువాత కొంతకాలమునకు అతడు క్రొత్తసైన్యములను కూర్చుకొని డేనులను ఓడించి మరలరాజయ్యెను.

కార్యసాధకుడు కష్టములను లెక్కపెట్టడు.

# 11. ముసలివాడు - గాడిద

ఒకానొక ముసలివాడు అమ్ముటకుగాను తన గాడిదను సంతకు తోలుకొనిపోవుచుండెను. అతనివెంట అతనికుమారుడుకూడకలడు. ఇరువురును గాడిదను తోలుకొనిపోవుట దారిపోవువారుచూచి ఇట్లు అనిరి. "ఏమి! వీరివెఱ్ఱి. ఇద్దరును క్రింద నడచుచు గాడిదను ఊరకే తోలుకొని పోవుచున్నారు. ఎవరైన ఒకరు ఎక్కి పోవచ్చునుకదా?"

ముసలివాడు ఆమాటలువిని తాను గాడిదపై ఎక్కి కుమారుని తోలుమని అనెను. అదిచూచినవారు "ఆహా ఈ ముసలివాడు దుర్మార్గుడు తనకన్న చిన్నవానిని నడిపించుచు తాను గాడిదపై ఎక్కి హాయిగ పోవుచున్నాడు" అనిరి! ఆమాటలువిని ఆముదుసలి గాడిదనుండిదిగి కుమారుని దానిపై ఎక్కించి నడచుచుండెను. అదిచూచినవారు మరల ఇట్లు అనిరి. "ఈపిల్లవానికి పెద్దలయెడ గౌరవములేదు. తండ్రిని నడిపించి తాను సుఖముగ కూర్చున్నాడు.

ఇదికూడ ముసలివాడు వినెను. తానుకూడ గాడిదపై ఎక్కి కుమారుని వెనుక కూర్చుండెను. అది చూచిన మరి కొందరు; "ఏమి ! వీరిదుర్మార్గము. ఇద్దరును దానిపై ఎక్కిరి. దానినడుము విఱుగదా?" అనిరి.

ఆ ముసలివానికి ఏమిచేయుటకును తోచలేదు. వాడు కొంచెముసేపు ఊరకుండెను. తరువాత ఆగాడిదకు నాలుగు

కాళ్లనుకట్టి కుమారుడును తానును కలసి కఱ్ఱతో మోయ సాగిరి. ఈవింతచూచిన ప్రజలు వారిని ఎగతాళిచేయుచు చప్పటలు కొట్టసాగిరి. ఆసమయమున వారు ఒక వంతెనపై పోవుచుండిరి. ఆచప్పుడువిని గాడిదగుంజు కొనెను. వారిచేతు లలోనిపట్టు తప్పుటచే అది నీటబడి మునిగిపోయెను. అందరిని సంతోషపెట్టవలెను అని ప్రయత్నించి ఆముసలివాడు విచా రముతో వెనుకకు పోయెను.

అందఱిని సంతృప్తి పరుపజాలము.

---

## 12. పెంకె గాడిద

ఉప్పు అమ్ముకొను వర్తకుడు ఒకడు తన గాడిదపై ఉప్పుబస్తాలను వేసికొని ఊరూర తిరుగుచుండెను. ఒకనాడు అతడు ఒక కాలువ దాటవలసివచ్చెను. అందు నీరులోతుగా ఉండెను. గాడిద అందుండి పోవునపుడు బస్తాలు నీటిలో తడి సెను. అపుడు అందున్న ఉప్పు కరగిపోవుటచే బస్తాలు బరువు తగ్గెను.

ఆగాడిద ఇదిగ్రహించి ఉప్పుబస్తాలతో కాలువ దాట వలసివచ్చినపుడు నీటిలో మునుగసాగెను. ఇది వర్తకుడుగ్ర హించి దానికి తగినశాస్తి చేయవలెను అని తలంచెను. ఒక

నాడు దానివీపుమీఁద ఇసుకబస్తాలను ఎత్తించి కాలువ దాటించెను.

మామూలుప్రకారము గాడిద నీటిలో మునిగెను. అందున్న ఉప్పుకరగి బరువు తగ్గును అని అది తలచెను. ఇసుక కరగదుగాని నీటితో తడిసినప్పుడు బరువెక్కును. అందుచే గాడిద పైకిలేచుసరికి బరువు హెచ్చెను. ఆబరువు మోయలేక అది చూచుచుండ త్వరగానడవలేదని వర్తకుడు దానిని చావ మోదెను.

పెంకెతనము పనికిరాదు.

---

# 13. నిమ్మకాయయంత మెతుకు

ఒక బాటసారి చాలదూరమునుండి నడచి వచ్చుచుండెను. ప్రొద్దుటనుండియు భోజనము చేయకపోవుటచే చాల ఆకలితో ఉండెను. అపుడు అతడు ఒకవంటపూటింటికిపోయెను. అందు మిక్కిలి పిసినిగొట్టు అగు ఒక ముసలిది ఉండెను. ఆమెను చూచి అతడు అన్నము అడిగెను. ఆమె అన్నములేదనెను. అందుపై అతడు ఆమెకు నాలుగు అణాలుఇచ్చి "అవ్వా నేను చాల ఆకలిగొనుచున్నాను. నాకు నిమ్మకాయయంత మెతుకు చాలును. నన్ను బ్రదికింపుము" అనెను.

ఆ అవ్వ నాలుగుఅణాలను తీసికొని అతనికి నిమ్మ కాయయంత ముద్దనే పెట్టెను. "ఇదేమమ్మా! నాలుగణాలు పుచ్చుకొని ఇదియా నాకచ్చుట?" అని అతడు ఆశ్చర్యముతో అనెను. "నీవు అడిగినంతయు ఇచ్చితిని నాతప్పేమి?" అని ఆమె అనెను.

అందుచే ఆతడుకోపించి న్యాయాధికారి దగ్గర ఫిర్యాదు చేసెను. న్యాయాధికారితో ఆమె ఇట్లనెను. "అయ్యా! నాకు ఇతడు నాలుగణాలుఇచ్చెను. నిమ్మకాయయంత మెతుకు చాలును అనెను. నేను అంత ముద్దనే పెట్టితిని. నాతప్పేమి?"

న్యాయాధికారి ఆమాటలువిని ఇట్లు తీర్పుచెప్పెను. "అవ్వా! నీవుచెప్పినది నిజము. నీవు ఇచ్చినది నిమ్మకాయ యంతముద్దగాని మెతుకుకాదు. ఇతడు అడిగినది నిమ్మకాయ యంత మెతుకు. కనుక నిమ్మకాయయంత మెతుకైన ఇమ్ము. లేదా అతని నాలుగణాలనైన తిరిగిఇమ్ము."

నిమ్మకాయయంత మెతుకు ఆమెకుదొరకదు. కనుక పావులా తిరిగిఇచ్చి ఆమె విచారముతో వెడలిపోయెను.

ఎత్తుకు పైఎత్తు ఉండును.

---

# 14. బాతు - బంగారు గ్రుడ్లు

అనగా అనగా ఒకప్పుడు ముసలిది ఒకతె బాతులను పెంచుచుండెను. వానిలో ఒకటి మిగిలినవాటికన్న బలముగను అందముగను ఉండెను. దానినిచూచి ఆవృద్ధురాలు ఆనందపడుచుండెను. ఆబాతుపెద్దది గ్రుడ్లుపెట్టసాగెను. అవిమామూలుగ్రుడ్లవలె ఉండక బంగారుగ్రుడ్లవలె కన్పించెను.. ఆమెవానిని జాగ్రత్తతో పరీక్షించి బంగారుగ్రుడ్లు అని నిశ్చయించెను. ఆబాతు రోజునకు ఒకగ్రుడ్డుచొప్పున పెట్టుచుండెను. వానిని అన్నిటిని ఆమెదాచిపెట్టి కొలదికాలములోనె చాల భాగ్యవంతురాలు ఆయెను.

ఇట్లుకొంతకాలము గడచినతరువాత ఆముసలియామెకు ఒకఉపాయము దోచెను. బాతు రోజునకు ఒకగ్రుడ్డుకన్న ఎక్కువపెట్టుటలేదు. అందువలన ఆమెధనము పెరుగుటకు చాలకాలము పట్టుచుండెను. కనుక ఆబాతును చంపి పొట్ట చీల్చినచో అందు చాలహెచ్చుగఉన్న బంగారమును ఒకమారుగ తీసికొనవచ్చును అని ఆమెఆలోచన.

ఆతీరుగనే ఆమె బాతును తీసికొనివచ్చి గొంతుకకోసి చంపెను. దానిపొట్టవిచ్చి చూచెను. కాని అందు ఎక్కడ చూచినను నల్లపూసయంతైన బంగారముకూడ కన్పింపలేదు. అపుడుఆమె తానుచేసిన తప్పుడుఆలోచనకు చాలసేపు విచారించెను. కాని లాభము లేకపోయెను.

ఆశకు మేర ఉండవలెను.

# 15. కొంగ—నక్క



నక్క జంతువులలోనికెల్ల జిత్తులమారి. ఇతర జంతువులను మోసముచేయుటయనిన దానికి పండుగ. ఒకనాడొక నక్క కొంగనొకదానిని చూచి తనయింటికి విందునకు పిలిచెను.

కొంగకు ముక్కు పొడవుగ ఉండును. అందుచే అది వెడల్పుగానున్న పళ్ళెరములో పోసిన పలుచని పదార్థములను తినజాలదు. నక్క ఇదికనిపెట్టి ఒకపళ్ళెరములో పలుచని పరమాన్నముపోసి కొంగముందు పెట్టెను. పాపము కొంగ

దానిని తినజాలక దిక్కులు చూచుచుండెను. నక్క గబగబ రెండుగ్రుక్కలలో దానిని త్రాగి, "కొంగబావ! మా పరమాన్నము నీకు రుచిగాలేదుకాబోలును" అనెను. కొంగ ఆకలితోనే తిరిగి వెడలిపోయెను.

కొంగమాత్రము నక్కచేసిన మోసము మఱువలేదు. దానికి తిరిగి తగినశాస్తిచేయతలచెను. నక్కను తిరిగి తన యింటికి విందునకు పిలచెను. కొంగకు జిత్తులు తెలియవు. నేను వెళ్ళెదననుచు నక్కఒప్పుకొనెను. నక్కకు పొడవగు మూతిలేదు. అందుచే కూజాలోవేసిన చేపముక్కలను అది అందుకొని తినజాలదు. కొంగయిదిగ్రహించి మంచిరుచిగా వండిన చేపలకూరను సన్ననిమూతిగల కూజాలోవేసి దాని ముందుంచెను. నక్క అందులో మూతిపెట్టజాలక తెల్లబోయిచూచు చుండెను. కూర మంచి వాసన గొట్టుచుండెను. నక్కకు నోరూరుచుండెను, కాని పాపము ఒక్కముక్కను గూడ అందుకొన లేకపోయెను. కొంగమాత్రము సులభముగ తినుచుండెను. నక్క విచారముతో ఇంటిమొగముపెట్టి వెడలెను.

**మోసము చేసినచో మోసపోవుదువు.**



# 16. సగము లాభము

తెనాలి రామకృష్ణుడు మిక్కిలి తెలివిగలవాడు. అతడనేక చమత్కారములనుచేసి రాజును మెప్పించెడివాడు.

రాజుగారి ద్వారపాలకులు లంచములేనిదే ఎవరిని లోనికి రానీయకుండిరి. వారికి ఎట్లైనను బుద్ధి చెప్పవలెనని రామకృష్ణుడు తలచెను. ఒకనాడాతడు రాజదర్శనమునకు పోవుచుండగ ద్వారపాలకులు ఇరువురును చేయిచాచి మామూలు అడిగిరి. ఆనాడు రాజుగారు తనకిచ్చు బహుమతిలో చెరొకసగముఇత్తునని చెప్పి లోనికివెడలెను. ద్వారపాలకులును తమ పుణ్యము పుచ్చినదని సంతోషించిరి.

రామకృష్ణుడానాడు మిక్కిలి చమత్కారముగ మాట్లాడి రాజును మెప్పించెను. అతడు రామునకేమి బహుమానముకావలెనో చెప్పుమనెను. రాముడులేచి ఇట్లనెను, "మహారాజా!నాకు రెండుడజనుల కొరడాదెబ్బలు కావలెను." రాజు ఆశ్చర్యపడి "ఎందుకు?" అనెను. అపుడు రాముడు మరల ఇట్లనెను, "దేవా ! మీద్వారపాలకులు నన్ను లంచము ఇమ్మని బాధించుచున్నారు. ఈరోజున మీరిచ్చిన బహుమతి వారిద్దరకు చెరొకసగము ఇత్తునని చెప్పినాను. ఏమిచ్చినను వారికి తృప్తిఉండదు. నిలవకూడ ఉండదు. కనుక చెరొకడజను దెబ్బలనువారికిత్తును.ఇకవారునన్ను లంచమిమ్మనిబాధింపరు"

ఆమాటలు విని రాజు ద్వారపాలురకు కబురంపెను. వారు వచ్చిన వెంటనే చెరొకడజను దెబ్బలను కొట్టించి ఇక ఎప్పుడును లంచమడుగరాదని బుద్ధిచెప్పి పంపెను.

**చెడువారిని శిక్షింపవలెను.**

---

# 17. పిల్లి - గరుడుడు

ఒకానొక అడవిలో పెద్ద మఱ్ఱిచెట్టుకలదు. దానిపై పక్షులు అనేకములు గూండ్లుకట్టుకొని తమతమ సంతానములతో సుఖముగ నివసించుచుండెను. ఆచెట్టునకు మొదలుగల తొఱ్ఱలో ఒకగరుడపక్షిఉండెను. ఆగరుడుడు వృద్ధుడును బలవంతుడును. ఆపక్షులన్నియు అతనిని గౌరవముగ చూచుచుండెను.

ఒకదినమున ఒకపిల్లి అతనియొద్దకువచ్చి "ఓయిగరుడుడ! నీవు చాలమంచివాడవని వింటిని. నీస్నేహముచేయవలెనని నాకోరిక. నేనుపక్షులను ఎలుకలను చంపుటమాని ఈఅడవిలో కాయలను పండ్లనుతిని బ్రతుకుచున్నాను" అనెను. ఆమాటలు గరుడుడునమ్మి పిల్లితో స్నేహముచేసెను.

ఆపిల్లి గరుడుని మోసపుచ్చి ప్రతిరోజును పక్షులను చంపితిని ఆయెముకలను చెట్టుతొఱ్ఱలో పడవేయుచుండెను,

కొంతకాలమునకు పక్షులు తమసంఖ్యతగ్గుట కనిపెట్టి కారణము ఆలోచింపదొడగెను. అంతటవారు పక్షియెముకలను చెట్టుతొఱ్ఱలో చూచి గరుడుడే ఆపక్షులను చంపెననియెంచెను. ఆపక్షులన్నియు కలసి అతనిపై బడి అతనినిచంపెను.

దుష్టులకు దూరమున ఉండవలెను.



## 18. అంతులేనికధ.

అనగా అనగా ఒకరాజు. అతనికి కధలువినుటయందు ప్రీతిహెచ్చు. అనేకమందివలన అతడు కధలువినెను. కాని వారెవరును అతనికి నచ్చినంత పెద్దకధచెప్పలేకపోయిరి. అందుచేత అతడొకనాడుఇట్లని చాటింపపంపెను, "నేను చాలు ననువరకును కధచెప్పగలవానికి నాకూతురను, అర్థరాజ్యమును ఇత్తును." అట్లు చెప్పలేనిచో ఉరితీయింతును."

రాజుకుమార్తె మిక్కిలి అందవతి. ఆమెతోగూడ సగమురాజ్యము వచ్చును. కనుక చాలమంది ఆశపడి కధలుచెప్పిరి. ఒకడు నెలదినములు చెప్పెను; ఇంకొకడు రెండునెలలు చెప్పెను; మరొకడు నాలుగునెలలు చెప్పెను. కానివారికధలు ఎప్పుడో ఒకప్పుడు ముగియుటచే రాజు వారిని ఉరితీయించెను. అప్పటినుండియు మరెవ్వరును వచ్చుటకు భయపడజొచ్చిరి.

అట్లుండగా ఒకనాడొక పడుచువాడు తాను కథ చెప్పుదునని వచ్చెను. చాలమంది అతనిని వలదని చెప్పిరి. కాని వాడు వినలేదు. రాజుతో వాడిట్లని మొదలుపెట్టెను, "పూర్వము ఒక కాపువాడు కలడు. అతనికి రెండువేలబస్తాలధాన్యము పండెను. అతడు వానిని తెచ్చి గాదెలోపెట్టి తాళమువేసెను. కాని ఆగాదెకు కప్పుమీద ఒకకన్నముండెను. దానివద్దకు ఒక పక్షివచ్చి ఒక గింజయెత్తుకొనిపోయెను.

"దీనితో కథ ఆఖరేనా?" అని రాజనెను.

"కాదు. తరువాత ఇంకొక పక్షివచ్చి ఇంకొక గింజ కొనిపోయెను."

"అటుతరువాత?"

"ఇంకొకపక్షివచ్చి మరొకగింజ యెత్తుకొనిపోయెను.

"అటుతరువాత?"

"ఇంకొక పక్షివచ్చి మరొకగింజఎత్తుకొనిపోయెను," అని అతడు చెప్పసాగెను. రాజు దానితో విసుగుచెంది వీడికవదల డని తలచి "ఓయీ! కథకచక్రవర్తీ! నీకు నమస్కారము. నాకుమార్తెను సగమురాజ్యమును నీకిచ్చుచున్నాను. నన్నికవదలుము" అని బ్రతిమాలెను.

మొండివాడు రాజుకన్న బలవంతుడు.



